## -: హోరా చక్రము :-

| సం. | భాగలు | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | 0–15 | ర | చం | ర | చం | ర | చం | ర | చం | ర | చం | ర | చం |
| 2. | 15–30 | చం | ర | చం | ర | చం | ర | చం | ర | చం | ర | చం | ర |

## -: ద్రేక్కాణ చక్రము :-

| సం. | భాగలు | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | 0–10 | కుజ | శుక్ర | బుధ | చంద్ర | రవి | బుధ | శుక్ర | కుజ | గురు | శని | శని | గురు |
| 2. | 10–20 | రవి | బుధ | శుక్ర | కుజ | గురు | శని | శని | గురు | కుజ | శుక్ర | బుధ | చంద్ర |
| 3. | 20–30 | గురు | శని | శని | గురు | కుజ | శుక్ర | బుధ | చంద్ర | రవి | బుధ | శుక్ర | కుజ |

## -: నవాంశ చక్రము :-

| సం. | భాగలు | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | 00–00–3–20 | మేష | మకర | తులా | కటక | మేష | మకర | తులా | కటక | మేష | మకర | తులా | కటక |
| 2. | 03–20–06–40 | వృష | కుంభ | వృశ్చి | సింహ | వృష | కుంభ | వృశ్చి | సింహ | వృష | కుంభ | వృశ్చి | సింహ |
| 3. | 06–40–10–00 | మిథు | మీన | ధను | కన్యా | మిథు | మీన | ధను | కన్యా | మిథు | మీన | ధను | కన్య |
| 4. | 10–00–13–20 | కటక | మేష | మకర | తులా | కటక | మేష | మకర | తులా | కటక | మేష | మకర | తులా |
| 5. | 13–20–16–40 | సింహ | వృష | కుంభ | వృశ్చి | సింహ | వృష | కుంభ | వృశ్చి | సింహ | వృష | కుంభ | వృశ్చి |
| 6. | 16–40–20–00 | కన్యా | మిథు | మీన | ధను | కన్యా | మిథు | మీన | ధను | కన్యా | మిథు | మీన | ధను |
| 7. | 20–00–23–20 | తులా | కటక | మేష | మకర | తులా | కటక | మేష | మక | తులా | కటక | మేష | మకర |
| 8. | 23–20–26–40 | వృశ్చి | సింహ | వృష | కుంభ | వృశ్చి | సింహ | వృష | కుంభ | వృశ్చి | సింహ | వృష | సింహ |
| 9. | 26–40–30–00 | ధను | కన్యా | మిథు | మీన | ధను | కన్యా | మిథు | మీన | ధను | కన్యా | మిథున | మీనం |

సూచన : జన్మ లగ్న, భుక్తి భాగలను గమనించి, భుక్తి భాగలకు సమముగ హోరాధిపతుల మరియు ద్రేక్కాణాధిపతుల, నవాంశములను, ఆయా లగ్నములననుసరించి పై చక్రముల ద్వారా తెలిసికొనవలెను.

## -: ద్వాదశాంశ చక్రము:-

| భాగములు | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 00-00 - 02-30 | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన |
| 02-30 - 05-00 | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన | మేష |
| 05-00 - 07-30 | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన | మేష | వృష |
| 07-30 - 10-00 | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన | మేష | వృష | మిథు |
| 10-00 - 12-30 | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన | మేష | వృష | మిథు | కటక |
| 12-30 - 15-00 | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన | మేష | వృష | మిథు | కటక | సింహ |
| 15-00 - 17-30 | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా |
| 17-30 - 20-00 | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా |
| 20-00 - 22-30 | ధను | మకర | కుంభ | మీన | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి |
| 23-30 - 25-00 | మకర | కుంభ | మీన | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను |
| 25-00 - 27-30 | కుంభ | మీన | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర |
| 27-00 - 30-00 | మీన | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ |

**వివరణ :** మేషాది ద్వాదశ రాసులకు, ఆయా రాసుల నుండి ద్వాదశాంశ గణన చేయాలి. ఉదా: మేషమునకు మేషాదిగా, మే, వృ, మిథు, కటక – ఇలా అన్ని రాసులకు, ఆయా రాశి నుండి ద్వాదశాంశ గణన చేయాలి. లగ్న భుక్తి భాగములు, ఏ ద్వాదశ భాగములందు గలవో గమనించి లగ్నమును బట్టి పై చక్రము ద్వారా ద్వాదశాంశము, తెలుసుకొనవలెను.



## విషమ త్రింశాంశ చక్రము

| భాగలు | మేష | మిథు | సింహ | తులా | ధను | కుంభ |
|---|---|---|---|---|---|---|
| 0-5/ మేష | కుజ | కుజ | కుజ | కుజ | కుజ | కుజ |
| 5-10 / కుంభ | శని | శని | శని | శని | శని | శని |
| 10-18 / ధను | గురు | గురు | గురు | గురు | గురు | గురు |
| 18-25 / మిథు | బుధ | బుధ | బుధ | బుధ | బుధ | బుధ |
| 25-30 / తులా | శుక్ర | శుక్ర | శుక్ర | శుక్ర | శుక్ర | శుక్ర |

**వివరణ :** విషమ రాసులగు, మేష, మిథున, సింహ, తులా, ధను, కుంభ రాసులకు మొదటి 5 భాగలు మేషాధిపతి, కుజ త్రింశాంశము. ఆ పై 5 భాగలకు (5-10) కుంభాధిపతియైన శని త్రింశాంశము. ఆ పై 8 భాగల (10-18) వరకు ధనుర్లగ్నాధిపతియైన గురు త్రింశాంశము. ఆ పై 7 భాగల (18-25) వరకు మిథున రాశ్యాధిపతియైన బుధ త్రింశాంశము. ఆ పైన 5 భాగలు 25-30 వరకు తులారాశ్యాధిపతియైన శుక్రుడు త్రింశాంశలగును.

## సమ త్రింశాంశ చక్రము

| భాగలు | వృష | కటక | కన్యా | వృశ్చి | మకర | మీన |
|---|---|---|---|---|---|---|
| 00-05/ వృష | శుక్ర | శుక్ర | శుక్ర | శుక్ర | శుక్ర | శుక్ర |
| 05/12 / కన్యా | బుధ | బుధ | బుధ | బుధ | బుధ | బుధ |
| 12/20 / మీన | గురు | గురు | గురు | గురు | గురు | గురు |
| 20/25 / మకర | శని | శని | శని | శని | శని | శని |
| 25/30 /వృశ్చి | కుజ | కుజ | కుజ | కుజ | కుజ | కుజ |

**వివరణ :** సమత్రింశాంశలైనట్టి వృషభ, కటక, కన్యా, వృశ్చిక, మకర, మీన త్రింశాంశములకు వరుసగా, మొదటి 5 భాగలకు వృషభ రాశ్యాధిపతియైన శుక్ర త్రింశాంశము ఆపై 7 భాగముల (5-12) వరకు కన్యా రాశ్యాధిపతియైన బుధ త్రింశాంశము, ఆపై 8 భాగలకు (12-20), మీన రాశ్యాధిపతియైన గురు త్రింశాంశము, ఆ పై 5 భాగలు (20-25), మకర రాశ్యాధిపతియైన శని త్రింశాంశము, ఆపైన 5 భాగములు (25-30) వృశ్చిక రాశ్యాధిపతియైన కుజ త్రింశాంశము.

**సూచన :** పై త్రింశా రాశాధిపతుల, లగ్న భుక్తి భాగముల ప్రకారము సమ, విషమ, రాసుల త్రింశాంశ చక్రమునందు ఆయా రాసుల భుక్తి భాగముల గమనించి, త్రింశాధిపతిని పై చక్రముల ద్వారా తెలుసుకొనవలెను.

ఆశ వలన వినాశము- భోగము వలన రోగము- యోగము వలన మోక్షము కలుగును.

# నక్షత్ర స్వామి స్వరూప సంజ్ఞా చక్రము

| | నక్షత్రముల పేర్లు | శుభా-అశుభ సంజ్ఞ | నక్షత్రాధి పతి | ముఖ సంజ్ఞ | రూప సంజ్ఞ | లోచన (చూపు) సంజ్ఞ | ఆకృతి | నక్షత్ర సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | అశ్విని | శుభ | అశ్వినీ-కుమారులు | తిర్యగ్-ముఖ | లగు-క్షిప | మందలోచన | అశ్వముఖా | 3 |
| 2 | భరణి | నాశక | యమ | అధోముఖ | ఉగ్ర-క్రూర | మధ్యలోచన | యోనిరూపా | 3 |
| 3 | కృత్తి | కార్యనాశ | అగ్ని | అధోముఖ | మిశ్ర-సాధారణ | సులోచన | వస్త్రరూపా | 6 |
| 4 | రోహిణి | సిద్ధి | బ్రహ్మ-ధాత | ఊర్ధ్వముఖ | ధృవ-స్థిర | అంధలోచన | రథాకృతి | 5 |
| 5 | మృగశిర | శుభ | చంద్ర | తిర్యన్‌ముఖ | మృదు-మైత్రి | మందలోచన | హరిణాకృతి | 3 |
| 6 | ఆర్ద్ర | శుభ | శివ-రుద్ర | ఊర్ధ్వముఖ | తీక్ష-దారుణ | మధ్యలోచన | మణిసమాకృ | 1 |
| 7 | పునర్వసు | మధ్యమ | దేవమాతఅధితి | తిర్యన్‌ముఖ | చర-చల | సులోచన | గృహాకార | 4 |
| 8 | పుష్యమి | శుభ | గురు | ఊర్ధ్వముఖ | లగు-క్షిప | అంధలోచన | శరసమ | 3 |
| 9 | ఆశ్లేష | శోక | సర్ప | అధోముఖ | తీక్ష-దారుణ | మందలోచన | చక్రకార | 5 |
| 10 | మఖ | నాశక | పితృ | అధోముఖ | ఉగ్ర-ధారుణ | మధ్యలోచన | శాలాకార | 5 |
| 11 | పుబ్బా | మృత్యుప్రద | భగ | అధోముఖ | ఉగ్ర-ధారుణ | సులోచన | శయ్యాకార | 2 |
| 12 | ఉత్తర | విద్యా | ఆర్యమ | ఊర్ధ్వముఖ | ధృవ-స్థిర | అంధలోచన | పర్యంకసమ | 2 |
| 13 | హస్త | లక్ష్మీ | రవి | తిర్యన్‌ముఖ | లఘు-క్షిప | మందలోచన | హస్తాసమ | 5 |
| 14 | చిత్త | శుభదాయక | త్వష్ట | తిర్యన్‌ముఖ | మృదు-మైత్రి | మధ్యలోచన | మౌక్తాకృతి | 1 |
| 15 | స్వాతి | అశుభ | వాయు | తిర్యన్‌ముఖ | చర-చల | సులోచన | మాణిక్యం | 1 |
| 16 | విశాఖ | అశుభ | ఇంద్రాగ్ని | అధోముఖ | మిశ్ర-సాధారణ | అంధలోచన | తోరణాకార | 4 |
| 17 | అనూరాధ | సిద్ధి | మిత్ర | తిర్యన్‌ముఖ | మృదు-మైత్రి | మందలోచన | రాశీసమ | 4 |
| 18 | జ్యేష్ఠ | క్షయ | ఇంద్ర | తిర్యన్‌ముఖ | తీక్ష-దారుణ | మధ్యలోచన | కుండలాకృతి | 3 |
| 19 | మూల | నష్టప్రద | రాక్షస | అధోముఖ | తీక్ష-దారుణ | సులోచన | సింహపుచ్ఛ | 11 |
| 20 | పూర్వాషాఢ | అర్థనాశ | ఉదక-జల | అధోముఖ | ఉగ్ర-క్రూర | అంధలోచన | హస్తదంత | 4 |
| 21 | ఉత్తరాషాఢ | బుద్ధిదాయక | విశ్వేదేవ | ఊర్ధ్వముఖ | ధృవ-స్థిర | మందలోచన | శయ్యాసమ | 3 |
| 22 | అభిజిత్ | బుద్ధిదాయక | బ్రహ్మ-ధాత | సర్వతోముఖ | లఘు-క్షిప | మధ్యలోచన | మత్స్యాకార | 3 |
| 23 | శ్రవణం | సుఖఃప్రద | విష్ణు | ఊర్ధ్వముఖ | చర-చల | సులోచన | మత్స్యాకార | 3 |
| 24 | ధనిష్ఠ | శుభప్రద | వసు | ఊర్ధ్వముఖ | చర-చల | అంధలోచన | శిరాకార | 3 |
| 25 | శతభిష | కళ్యాణి | వరుణ | ఊర్ధ్వముఖ | చర-చల | మందలోచన | వర్తులాకార | 100 |
| 26 | పూర్వాషాఢ | మృత్యుదాయక | అజైకపాత | ఊర్ధ్వమత | ఉగ్ర-క్రూర | మధ్యలోచన | యమతకా | 2 |
| 27 | ఉత్తరాషాఢ | లక్ష్మీ | ఆహిర్బు | ఊర్ధ్వముఖ | ధృవ-స్థిర | సులోచన | మంచాకార | 2 |
| 28 | రేవతి | కామదాయక | పూ.షా. | తిర్యన్‌ముఖ | మృధు-మైత్రి | అంధలోచన | మృదంగ | 3 |



# రాశీ స్వరూప బోధక చక్రము

| రాశి | మేష | వృష | మిథు | కటక | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చరాది సంజ్ఞ | చర | స్థిర | ద్విస్వభావ | చర | స్థిర | ద్విస్వభావ | చర | స్థిర | ద్విస్వభావ | చర | స్థిర | ద్విస్వభావ |
| తత్త్వం | అగ్ని | పృథ్వి | వాయు | జలతత్వ | అగ్ని | పృథ్వీతత్వ | వాయు | జలతత్త్వ | అగ్ని | పృథ్వీ | వాయుతత్త్వ | జలతత్త్వ |
| పిత్తాదిదోష | పిత్త | వాయు | త్రిదోష | కఫ | పిత్త | వాయు | త్రిదోష | కఫ | పిత్త | వాయు | త్రిదోష | కఫ |
| జాతి | క్షత్రియ | వైశ్య | శూద్ర | విప్ర | క్షత్రియ | వైశ్య | శూద్ర | విప్ర | క్షత్రియ | వైశ్య | శూద్ర | విప్ర |
| చతుష్పాద సంజ్ఞ | చతుష్పాద | చతుష్పాద | ద్విపాద | బహుపాద | చతుష్పాద | ద్విపాద | ద్విపాద | బహుపాద | ద్విపాద | చతుష్పాద్ | అపాద | జలచర |
| స్త్రీ – పు సంజ్ఞ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ |
| శుభ-అశుభ | క్రూర | శుభ | క్రూర | శుభ | క్రూర | శుభ | క్రూర | శుభ | క్రూర | శుభ | క్రూర | శుభ |
| వర్ణ | రక్తవర్ణ | శ్వేత | హరిత | పాటల | పీతవర్ణ | బుక్షపాండు | చిత్రవర్ణ | శ్వేతవర్ణ | స్వర్ణవర్ణ | పింగళవర్ణ | కార్బూసవర్గ | భభ్రువర్ణ |
| ప్రకృతి | ఉష్ణ | శీత | ఉష్ణ | శీత | ఉష్ణ | శీత | ఉష్ణ | శీత | ఉష్ణ | శీత | ఉష్ణ | శీత |
| శబ్దాది సంజ్ఞ | అతిశబ్ద | అతిశబ్ద | అతిశబ్ద | హీనశబ్ద | దీర్ఘస్వర | అర్థశబ్ద | హీనశబ్ద | హీనశబ్ద | అధికశబ్ద | ఖండస్వర | ఖండస్వర | హీనశబ్ద |
| వారణ స్వతాని | పర్వతచారి | భూచర | వనచారి | జలచారి | పర్వతచారి | భూచార | వనచారి | జలచర | పర్వతచారి | భూచరి | స్థల-జల-చారి | జలచారి |
| దిన-రాత్రిజల | దిన-బల | రాత్రి-బల | దిన-బల | రాత్రి-బల | దినబల | రాత్రి-బల | దిన-బల | రాత్రిబల | దిన-బల | రాత్రి-బల | దిన-బల | రాత్రి-బల |
| ధిక్‌స్వామి | తూర్పు | దక్షిణ | పశ్చిమ | ఉత్తర | తూర్పు | దక్షిణ | పశ్చిమ | ఉత్తర | తూర్పు | దక్షిణ | పశ్చిమ | ఉత్తర |
| ఉదయాదిచేధ | విషమోదయ | విషమోదయ | సమోదయ | సమోదయ | సమోదయ | సమోదయ | సమోదయ | సమోదయ | సమోదయ | విషమోదయ | విషమోదయ | విషమోదయ |

# గోరక్షామతానుసారేణ గమన ప్రయాణ తిథి ఫల చక్రము

| మాసములు --- మాసములు | | | | | | | | | | | | దిశలు (దిక్కులు) | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పౌష్య | మాఘ | ఫాల్గు | చైత్ర | వైశా | జ్యేష్ఠ | ఆషా | శ్రావ | భాద్ర | ఆశ్వీ | కార్తీ | మార్గ | తూర్పు | దక్షిణ | పశ్చిమ | ఉత్తర |
| ప్రతి | విది | తది | చవి | పంచ | షష్టి | సప్త | అష్ట | నవ | దశ | ఏకా | ద్వాద | సౌఖ్యం | క్లేశం | భీతి | ధనప్రదం |
| విది | తది | చవితి | పంచ | షష్టి | సప్త | అష్ట | నవ | దశ | ఏకా | ద్వాద | ప్రతి | శూన్యం | దరిద్ర్యం | దరిద్ర్యం | మిత్రలాభం |
| తది | చవితి | పంచ | షష్టి | సప్త | అష్ట | నవ | దశ | ఏకా | ద్వాద | ప్రతి | విది | ధన నాశం | వ్యధ | ఇష్టప్రదం | ద్రవ్యలాభం |
| చవితి | పంచ | షష్టి | సప్త | అష్ట | నవ | దశ | ఏకా | ద్వాద | ప్రతి | విది | తది | లాభం | సుఖం | కళ్యాణం | లాభం |
| పంచ | షష్టి | సప్త | అష్ట | నవ | దశ | ఏకా | ద్వాద | ప్రతి | విది | తది | చవితి | ప్రీతిప్రదం | ద్రవ్యలాభం | ద్రవ్యలాభం | సుఖం |
| షష్టి | సప్తమి | అష్టమి | నవమి | దశమి | ఏకా | ద్వాద | ప్రతి | విది | తది | చవితి | పంచ | భయం | లాభం | మృత్యు | లాభ |
| సప్తమి | అష్టమి | నవమి | దశమి | ఏకా | ద్వాద | ప్రతి | విది | తది | చవితి | పంచ | షష్టి | ధనలాభం | పీడా | ధనప్రాప్తి | సుఖం |
| అష్టమి | నవమి | దశమి | ఏకా | ద్వాద | ప్రతి | విది | తది | చవితి | పంచ | షష్టి | సప్తమి | కష్టం | సుఖం | క్లేషం | సుఖం |
| నవమి | దశమి | ఏకా | ద్వాద | ప్రతి | విది | తది | చవితి | పంచ | షష్టి | సప్తమి | అష్టమి | సుఖం | లాభం | లాభం | కష్టం |
| దశమి | ఏకా | ద్వాద | ప్రతి | విది | తది | చవితి | పంచ | షష్టి | సప్తమి | అష్టమి | నవమి | కలహం | వ్యధ | అర్థలాభం | ద్రవ్యలాభం |
| ఏకా | ద్వాద | ప్రతి | విది | తది | చవితి | పంచ | షష్టి | సప్తమి | అష్టమి | నవమి | దశమి | మృత్యు | లాభం | అర్థలాభం | శూన్యం |
| ద్వాద | ప్రతి | విది | తది | చవితి | పంచ | షష్టి | సప్తమి | అష్టమి | నవమి | దశమి | ఏకా | శూన్యం | సుఖం | మృత్యు | కష్టం |



# గోరక్షామతానుసారేణ (గమన) ప్రయాణ తిథి ఫల చక్రము

## -: శ్లోకములు :-

శ్లో॥ మాసే శుక్లాదికే పౌష్యే తిథిః ప్రతిపదాదితః।
ద్వితీయాధ్యస్తు మాఘేస్తు తృతీయాధ్యస్తు ఫాల్గుణే ॥

శ్లో॥ ఏ వం, చాన్యేషు మాసేషు తిథ్యో ద్వాదశ సంజ్ఞికాః ।
తృతీయాది త్రయోతత్ త్రయోదశ్యాధికే ఫలం ॥

శ్లో॥ యానే ప్రాచ్యాది కాష్ట సు వశ్యే ద్వాదశ ధాక్రమాత్।
సౌఖ్యం, శూన్యం, ధనార్థశ్చలాభః ప్రీతిర్భయం, ధనం॥

శ్లో॥ కష్టం సౌఖ్యం, కలిర్మృత్యుః శూన్యం ప్రాచ్యం ఫలం క్రమాత్ ।
క్లేశో నైః స్వయం వ్యథా సౌఖ్యం ద్రవ్యప్రాప్తిర్లాభ పీడనే ॥

శ్లో॥ సౌఖ్యం, లాభో వ్యయోలాభః సౌఖ్య యామ్యాదిశి ధ్రువమ్ ।
భయం న సౌఖ్యం ప్రియాత్ప్రియశ్చ బద్రం ద్రవ్యం, మృతిర్ధనం ।
క్లేశో, లాభో అర్థ సిద్ధిః స్వలాభో మృత్యుశ్చ పశ్చిమే ॥

శ్లో॥ ధనం మిత్రం ధనం లాభః సౌఖ్యం లాభో వ్యథాస్సుఖం ।
కష్టం ద్రవ్యత్వ శూన్యత్వం కష్టముత్తర దిగ్ఫలం ॥

## -: ఫలము తెలిసికొను విధానము :-

ఈ చక్రము నందు, పౌష్య మాసం నుండి మార్గశిర మాసము వరకు, పాడ్యమి (ప్రతిపద) నుండి ద్వాదశి వరకు తిథులు ఇవ్వబడినవి. ఇందు త్రయోదశి చతుర్దశి పౌర్ణిమ తిథులను చూపలేదు. కారణము, త్రయోదశి, చతుర్దశి,పౌర్ణిమ ఫలితములు, వరుసగా తదియ, చవితి, పంచమి, తిథుల ఫలితములు ఒక్కటేనని తెలిసికొనగలరు.

ప్రయాణం చేయ నిర్ణయించిన (దినము) మాసము నందు ఏ తిథియగునో చూచుకొని, దానికి ఎదురుగా గల తూర్పు, పశ్చిమ, దక్షిణ, ఉత్తర, దిశలలో గల ఫలమును (మీరు ప్రయాణమగు దిశ యందు గల ఫలమును) గమనించి శుభ ఫలమున్న ప్రయాణము చేసిన లాభం కలుగును. అశుభ ఫలితమున్న ప్రయాణము నందు, కష్ట, నష్ట, ప్రమాదములు కలుగును.

పై చక్ర ఫలితముల ప్రకారము ప్రయాణము చేయునపుడు, వార, వర్జ్య, ఘాత కుయోగములున్నను, ప్రయాణమున శుభ ఫలములు కలుగును. కావున వర్జ్య, ఘాత, కుయోగములను చూడ వలసిన పనిలేదు.

## నక్షత్రానుసారేణ నవాంశాధిపతుల వివరణ చక్రం

| అంశాలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పాదములు | 1 | 2 | 3 | 4 | 1 | 2 | 3 | 4 | 1 | 2 | 3 | 4 |
| నక్షత్రములు | అశ్విని | అశ్విని | అశ్విని | అశ్విని | భరణి | భరణి | భరణి | భరణి | కృత్తిక | కృత్తిక | కృత్తిక | కృత్తిక |
| | రోహిణి | రోహిణి | రోహిణి | రోహిణి | మృగశిర | మృగశిర | మృగశిర | మృగశిర | ఆరుద్ర | ఆరుద్ర | ఆరుద్ర | ఆరుద్ర |
| | పునర్వసు | పునర్వసు | పునర్వసు | పునర్వసు | పుష్యమి | పుష్యమి | పుష్యమి | పుష్యమి | ఆశ్లేష | ఆశ్లేష | ఆశ్లేష | ఆశ్లేష |
| | మఖ | మఖ | మఖ | మఖ | పుబ్బ | పుబ్బ | పుబ్బ | పుబ్బ | ఉత్తర | ఉత్తర | ఉత్తర | ఉత్తర |
| | హస్తమి | హస్తమి | హస్తమి | హస్తమి | చిత్త | చిత్త | చిత్త | చిత్త | స్వాతి | స్వాతి | స్వాతి | స్వాతి |
| | విశాఖ | విశాఖ | విశాఖ | విశాఖ | అనూరాధ | అనూరాధ | అనూరాధ | అనూరాధ | జ్యేష్ఠ | జ్యేష్ఠ | జ్యేష్ఠ | జ్యేష్ఠ |
| | మూల | మూల | మూల | మూల | పూ.షా. | పూ.షా. | పూ.షా. | పూ.షా. | ఉ.షా. | ఉ.షా. | ఉ.షా. | ఉ.షా. |
| | శ్రవణం | శ్రవణం | శ్రవణం | శ్రవణం | ధనిష్ఠ | ధనిష్ఠ | ధనిష్ఠ | ధనిష్ఠ | శతభిష | శతభిష | శతభిష | శతభిష |
| | పూ.భాద్ర | పూ.భాద్ర | పూ.భాద్ర | పూ.భాద్ర | ఉ.భాద్ర | ఉ.భాద్ర | ఉ.భాద్ర | ఉ.భాద్ర | రేవతి | రేవతి | రేవతి | రేవతి |
| అంశాధిపతులు | కుజ | శుక్ర | బుధ | చంద్ర | రవి | బుధ | శుక్ర | కుజ | గురు | శని | శని | గురు |



## నవగ్రహములు ఆయా (12) రాసులలో ఉన్నప్పుడు కలుగు గోచార ఫలములు

ఏదైనా గ్రహము
1-6-11 రాసులందున్నప్పుడు స్వర్ణమూర్తి - సంపూర్ణ శుభకారకము.
2-5-9 రాసులలో ఉంటే రజితమూర్తి.
రజిత మూర్తి నాల్గింట మూడు వంతులు (3/4) శుభకారకము.
3-7-10 రాసులలో ఉంటే తామ్రమూర్తి.
తామ్రమూర్తి నాల్గింట ఒక వంతు (1/4) మాత్రమే శుభకారకము.
4-8-12 రాసులలో నున్నప్పుడు లోహమూర్తి.
లోహమూర్తి సంపూర్ణంగా అశుభకారకము.

★ ఈ గుర్తు గల స్థానములో ఆయా రాసులలో ఆయా గ్రహములిచ్చెడి శుభ ఫల స్థానములు.

### 1. సూర్యుడు ఇచ్చు సంచార ఫలములు

1లో సంచార యోగం, అనారోగ్యం, వేళ తప్పిన భోజనం, వ్యవహార మాంద్యం, వైరము.
2లో అధిక వ్యయం, నేత్ర సామర్థ్య హీనత, శిరోవేదన, లాభాల మందగింపు, మోసము.
★ 3లో మానసికోల్లాసం, శారీరక సుఖం, ఇష్టసిద్ధి, సంతృప్తికరాదాయం, ఆరోగ్యము.
4లో కార్యాలలో ప్రతికూలత, ఆరోగ్య క్షీణత, మానసికాందోళన, కుటుంబ కలహాలు.
5లో నమ్మకద్రోహం, ధననష్టం, శత్రువుల వలన భయం, ఆలోచనా హీనత.
★ 6లో కార్య సానుకూలత, లక్ష్యసిద్ధి, శారీరక సౌఖ్యం, ధనసమృద్ధి, ఆరోగ్యము.
7లో కళత్ర సమస్య, అభిప్రాయ భేదము, సంతాన బాధలు, నిరుత్సాహం, ప్రయాణాలలో నష్టం, అనారోగ్యం.
8లో గర్వ సంబంధ అనారోగ్యం, విరోధాలు, విచారం, శతృవృద్ధి, ప్రయాణాలలో ప్రమాదాలు, మనశ్చింత.
9లో అకారణ వైరము, ధననాశము, మనోవ్యాకులత, అనుకున్న పనులకాటంకం.
★ 10లో కార్యసిద్ధి, కుటుంబంలో శుభములు, మహనీయుల కలయిక, శారీరక సౌఖ్యం, సంఘంలో గౌరవ మర్యాదలు.
★ 11లో వ్యాపార వృద్ధి సుఖ సంతోషాలు, శుభకార్య నిర్వహణ, స్థిరాస్తులలో లాభం, ధనాదాయం.
12లో అనవసర ప్రయాణం, ప్రాణాపాయ సూచన, సమీప బంధునష్టం, ఉష్ణ సంబంధ వ్యాధులు, ధననాశం.

### 2. చంద్రుడు నుండి కలుగు ఫలితాలు

★ 1లో నూతన వస్త్ర, ఆభరణ ప్రాప్తి, రతిసౌఖ్యము, ఆరోగ్యము, సమాజంలో గౌరవం, సుఖనిద్ర, భోజన సౌఖ్యం.
2లో అనారోగ్యం, ధనవస్తు నష్టం, కార్యాలలో ప్రతికూలత, మానసిక బాధ, ఆహార సంబంధ సమస్యలు.
★ 3లో స్త్రీ సౌఖ్యం, ధనవస్తు, ఆభరణ లాభం, కార్యములందు విజయం.
4లో అలసత్వర, మరుపు వలన సమస్యలు, బంధు మిత్ర వైరము, ఆందోళన, ప్రతి పనిలోనూ ప్రతికూలత.
5లో మనశ్చింత, ధననష్టం, మానసికాందోళన, బలహీనత, భయము, వాత సంబంధ సమస్యలు.
★ 6లో పుణ్యము, కీర్తి, ఆరోగ్యం, ధనాదాయము, స్త్రీ సుఖము, గృహమందు శుభకార్య నిర్వహణ, స్వస్థల నివాస ప్రాప్తి.
★ 7లో అన్నింటా అభివృద్ధి, సకల కార్యసిద్ధి, స్త్రీ సుఖం, శారీరక సౌఖ్యం, మనోల్లాసం.
8లో అజీర్ణ బాధ, నరాల బలహీనత, ధననాశము, నిద్రలేమి, అకారణ వైరము.
9లో స్థానచలనం, కార్యరంగంలో ప్రతికూలత, శతృవృద్ధి, బంధుమిత్ర పుత్ర విరోధము, కుటుంబ సమస్యలు.

★ 10లో చేపట్టిన ప్రతి పనిలో సానుకూలత, అభీష్టసిద్ధి, ఆరోగ్యం, శుభకార్య నిర్వహణ, సుఖ సంతోషాలు,

★ 11లో శుభవార్తా శ్రవణం, విందు భోజనము, కార్యసిద్ధి, ధనలాభము, సద్గోష్టి.

12లో సంఘంలో అగౌరవం, శారీరక శ్రమ, అధిక వ్యయం, మనో వికలత్వం, శత్రువృద్ధి, కార్యనాశము.

## 3. కుజుడు (అంగారకుడు) కలుగజేయు ఫలములు

1లో కార్యవిఘ్నము, భార్యతో కలహం, శత్రువృద్ధి, త్రిప్పట, తీవ్రమైన ఉష్ణ సంబంధ అనారోగ్యం.

2లో దుష్టులతో అకారణ కలహం, ప్రమాదం, కార్యవస్తు నష్టం, దుర్బలత్వం, తేజక్షీణత.

★ 3లో సర్వకార్యసిద్ధి, సజ్జన సాంగత్యం, అనూహ్య ధనప్రాప్తి, ఆరోగ్యం, సుఖం.

4లో యంత్ర సంబంధిత ప్రమాదాలు, గాయాలు, దుష్టులతో కలహం, శారీరక శ్రమ, కార్యవిఘ్నము, పైత్య సంబంధ రోగము.

5లో పాప కార్యాసక్తి, సంతాన, శత్రు సమస్యలు, వేడి ఆహార విహారాదులకు ఆటంకములు, అనారోగ్యం.

★ 6లో పుణ్య కార్య నిర్వహణ, సత్కాలక్షేపము, ధన ధాన్య ప్రాప్తి, ఇష్ట కార్యసిద్ధి, కీర్తి, అలంకార ప్రాప్తి, సభా గౌరవము.

7లో ఉదర, నేత్ర సంబంధ వ్యాధులు, వస్తు నాశము, కుటుంబ కలతలు, బంధు మిత్ర వైరము.

8లో శ్వాసకోశ సమస్యలు, ఋణబాధ, త్రిప్పట, కార్య ప్రతికూలత, అగౌరవం.

9లో వ్యవహార మాంద్యత, అధికారుల నుండి సమస్యలు, స్థాన చలనము, ఆరోగ్య క్షీణత.

10లో స్వల్ప లాభకారి, వృధాభ్రమణము, ఆహార వ్యతిరేకత, కార్యక్షేత్రంలో ప్రతికూలత.

★ 11లో శీఘ్ర కార్యసిద్ధి, ధన, నూతన వస్త్రలాభం, ధైర్యము, కార్య సానుకూలత, సుఖ సంతోషములు.

12లో స్థాన చలనము, శారీరక శ్రమ, అవమానములు, అధిక వ్యయము, నేత్ర సంబంధ రోగములు, అకారణ కలహములు.

## 4. బుధుడు ఇచ్చు ఫలితములు

1లో వ్యర్థ కలహాలు, దుర్మార్గ స్నేహం, అకాల భోజనం, విద్యలో వైఫల్యము, బంధుమిత్ర విరోధం.

★ 2లో సత్సాంగత్యము, సుఖసంతోషములు, విందు వినోదాలు, ఆరోగ్యము, సర్వదా అనుకూలత.

3లో బుద్ధిహీనత, అధికారుల ముందు చులకన, బంధు విరోధము, వస్తునష్టం, శత్రుప్రమాద యోగములు.

★ 4లో మనోవికాసము, సర్వకార్యసిద్ధి, శుభకార్య నిర్వహణ, మాతృసుఖము, కుటుంబ సౌఖ్యం.

5లో పైత్య సంబంధ వ్యాధులు, అకారణ కలహము, ఆదరణ లోపము, తీవ్ర ఉష్ణ సంబంధ రోగములు, మనోవ్యాకులత.

★ 6లో విద్యాధిక్యతచే ఆనందము, మనోధైర్యము, ధనలాభం, విజయ ప్రాప్తి, మాట చెల్లుబాటు.

7లో అధికారుల ఆగ్రహము, దురదృష్టము, ఆత్మీయుల ఎడబాటు, ఉష్ణాధిక్యము, జడత్వము, ఆందోళన.

8లో మానసిక భీతి, బంధునష్టం, హృదయ తాపము, రోగము, సుఖము, విజయప్రాప్తి.

9లో అలసత్వము, కీర్తినాశము, అసత్య ప్రలాపం, అసంతుష్ట భోజనము, మీ వల్ల అన్యులకు ప్రమాదాలు.

10లో అలసత్వం, అపకీర్తి, చీవాట్లు, భోజనహాని, అసౌఖ్యం, విపరీత సంతాపంలో కొద్దిపాటి ప్రశాంతత.

★ 11లో ధన కనక వస్తుప్రాప్తి, గృహంలో శుభకార్య నిర్వహణము, సత్కీర్తి, బంధుమిత్రులతో ఆనందము.

12లో ఆశించిన కార్యనాశనము, రోగవృద్ధి, కష్టకాలము, అసౌఖ్యము, మనోవ్యాకులత.



## 5. గురువు ఇచ్చే ఫలితములు

1లో స్థాన చలనము, నివాసంలో మార్పు, వ్యర్థ సంచారము, మనశ్చింత, వస్తునాశనం, ఉద్యోగ నాశనము.

★ 2లో కుటుంబ సౌఖ్యం, కీర్తివృద్ధి, ధనాదాయము, దానధర్మ నిర్వహణ, మనోనిబ్బరము, సంతృప్తి.

3లో పట్టుదల సడలింపు, అనూహ్య ప్రమాదం, దరిద్రము, వ్యవహార నాశము, బంధువిరోధం, శారీరక శ్రమ.

4లో ఆదాయానికి మించి వ్యయం, బంధు మరణ వార్తా శ్రవణం, స్థానభ్రంశము, ధననాశము, యాచక దైన్యము.

★ 5లో మనోవాంఛా సిద్ధి, దైవానుగ్రహము, ఐశ్వర్యప్రాప్తి, కార్యానుకూలత, బంధువృద్ధి, కీర్తి, ధనలాభం, శారీరక సౌఖ్యము.

6లో ఉద్యోగ మార్పిడి, అనూహ్య ఆపద, రాజశిక్ష, అగ్నిబాధ, చోరభయం, బంధు మిత్ర స్పర్థలు.

★ 7లో కార్యసిద్ధి, శారీరక సౌఖ్యం, ఆరోగ్యం, అధికార సందర్శనం, సంపూర్ణ ఆనందం.

8లో గృహ సమస్య, రాజ భయం, హాని, కోపము, అనూహ్య అవరోధములు, అగ్నిప్రమాదము, చోరభయం.

★ 9లో స్థిరాస్తుల లాభము, తపోలాభం, లాటరీల్లో, గుఱ్ఱపు పందెంలో విజయం, స్త్రీ సౌఖ్యం, కులాచారము ప్రకారం వృత్తి రాణింపు.

10లో కార్య విఘ్నత, అశాహతము, వ్యర్థ సంచారము, వృత్తి భగ్నము, ధన ధాన్య ప్రాప్తి.

★ 11లో అన్నింటా లాభం, కీర్తి, తేజోవృద్ధి, బలసంపన్నత, విజయ ప్రాప్తి, పదోన్నతి.

12లో స్థానచలనము, పదవీ హీనత, వ్యర్థ ప్రయాణములు, స్త్రీ చలన వ్యయము.

## 6. శుక్రుడు ఇచ్చే ఫలితములు

★ 1లో ఆనందము, పరవశత్వం, కార్య సాఫల్యం, పరస్త్రీ సంగమ సిద్ధి, ధనలాభం, భోజన సౌఖ్యం, వస్తుప్రాప్తి.

★ 2లో స్త్రీ సల్లాప సంతోషము, ధన కనక వస్తు లాభములు, రతి సౌఖ్యము, కీర్తి, అకారణ కలహాలు.

3లో వ్యాపార భాగస్వాముల వలన నష్టం, జీవనాధార నష్టం, వ్యయ ప్రయాసలు, కార్యహాని.

★ 4లో అందరి వలన ఆనందము, స్త్రీ సౌఖ్యము, వాహన ప్రాప్తి.

★ 5లో తల్లిదండ్రులకు ఆనందం, సంతాన సుఖం, విందు భోజన ప్రాప్తి, ధన ధాన్య లాభము, సేవ లాభము, సేవకా జనానురక్తి.

6లో జ్ఞాతుల కలహము, కుటుంబ సమస్యలు, కళత్ర రోగం, రతిహాని.

7లో భయవృద్ధి, సుఖరోగం, స్త్రీ కలహం, వృథా కోపం, అధిక వ్యయము.

★ 8లో స్థిరాస్థుల వృద్ధి, రతి సుఖాధిక్యత, ధనప్రాప్తి, కీర్తిలాభం, బంధుమిత్ర సాంగత్యం.

★ 9లో ధర్మకార్యాచరణ, ప్రేమకలాపాలు, దేశభక్తి, గురుపూజ, కార్యసిద్ధి, ఆరోగ్యం, కులాచారాభిమానం.

10లో కార్యవిఘ్నము, వస్తునాశము, బలహీనత, స్త్రీ సుఖ నాశము, శత్రుభీతి, ఉద్యోగ భ్రష్టత.

★ 11లో సుఖ శాంతులు, కీర్తివృద్ధి, ఇష్టకార్య సిద్ధి, విందు భోజనము, కార్యలాభము, తేజోవృద్ధి.

12లో ఆయుధాఘాతము, యంత్ర ప్రమాదములు, కార్యవిఘ్నములు, ఆరాటము.

## 7. శని గ్రహము ఇచ్చు ఫలములు

1లో ఒకటిలో శని ఉంటే ఆ సమయాన్ని జన్మ శని అంటారు. ఈ సమయంలో భార్యాపుత్ర బంధువులకు నష్టం, ప్రమాదం, తేజో క్షీణత, అనారోగ్యం, మనశ్చింత.

2లో గౌరవ నాశము, ధన హాని, త్రిప్పట, దూషణలు, ఆరోగ్య నాశనము, కుటుంబ కలతలు.

★ 3లో కీర్తి ధనాదాయం, శ్రమకు గుర్తింపు, ప్రయాణ లాభం, వ్యవహార సాఫల్యము.

4లో నాల్గులో శని ఉంటే అది అర్ధాష్టమ శని అంటారు. ప్రమాదాలు, విచారము, బంధుమిత్ర పీడ, ప్రసవ వార్తా ప్రాప్తి, అనారోగ్య బాధ.

5లో అనూహ్య నష్టములు, ప్రమాదాలు, తగాదాలు, నీచ స్త్రీలతో రతి,మనశ్చాంచల్యము, శ్రమ.

★ 6లో ధనాదాయము, ధాన్య సమృద్ధి, గృహ నిర్మాణావకాశము, బంధు జన సంతోషము, కార్య సాఫల్యము, శత్రు పరాభవము.

7లో ప్రయాణము, వేర్పాటు, మనోవేదన, దేశాంతర యానం, విపరీత భయాందోళనలు, వ్యాధిపీడ.

8లో ఎనిమిదింట శనిని అష్టమ శని అంటారు. మృత్యు ప్రాప్తి, ఆపదలు, స్వజన నాశము, ద్వేషాలు, నేరారోపణ, నిష్ఠూరములు, శిక్షాప్రాప్తి, అవమానములు.

9లో దుఃఖము, ధనాదాయ క్షీణత, తలచిన పనులు కుంటుపడుట, లాభించే చోటనే నష్టము.

10లో మనోవ్యాకులత, పాప కార్యాచరణ, ఉద్యోగ నష్టము, వ్యవహార నాశము.

★ 11లో వ్యాపార లాభము, స్త్రీ సల్లాపము, సంతాన సౌఖ్యము, మనో నిర్మలత, ఇష్టవాంఛా ఫలసిద్ధి.

12లో ధనవ్యయం, ప్రమాద సూచన, విచారము, వ్యయ ప్రయాస, శ్రమ.

**గమనిక: రాహువు** ఇచ్చు ఫలితాలు 3వ గ్రహమైన **కుజుని** ఫలితాలతోనూ, **కేతువు** ఇచ్చే ఫలితాలు 7వ గ్రహమైన **శని** ఫలితాలతోనూ సమానము.

## దుష్ట నక్షత్ర కాల జననమునకు సంభవించు గుణ దోష వివరములు, శాంతులు

**అశ్విని నక్షత్రము వలన వచ్చు దోషము:** ఒకటవ పాదంలో శిశు జననం తండ్రికి, శిశువుకు దోషము. మూడు మాసముల పాటు ఉండే ఈ దోషాపహ్యాతికి హోమ సహితంగా శాంతి జరపాలి. మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము. జనన కాల నక్షత్ర, నవగ్రహ జపములు, నవగ్రహ దానముతో పాటు సువర్ణ దానము చేయవలెను. ద్వితీయ, తృతీయ, చతుర్థ పాదములలో జన్మించినచో దోషకారి కాకపోయినను, నక్షత్రము దుష్టప్రభావము కలది కావున సామాన్య శాంతి ఆద్య వీక్షణముతో జరిపించాలి. శిశువు యొక్క ముఖమును మంత్రయుక్తముగా నూనెలో తండ్రి చూడడాన్ని ఆద్యవీక్షణము అంటారు. ఈ నక్షత్రమున పురుష జననమైనచో సౌందర్యము, శౌర్యము, వినయ విధేయతలు కలవాడవుతాడు. ధనార్జనాపరుడు, కీర్తివంతుడు, దీర్ఘదేహ దారుఢ్యము కలవాడు అవుతాడు. స్త్రీ జన్మించినచో వ్యవహార జ్ఞానము, అహంకారము కలది యగును.

**భరణి** : ఒకటి రెండు, నాలుగు పాదములలో జన్మించినచో దోషము కాదు. తృతీయ పాదమందు పుత్రుడు జన్మిస్తే ఆ శిశువునకు, తండ్రికి; ఆడ శిశువు జన్మిస్తే శిశువునకు, తల్లికి దోషము. ఇది ఇరువదియేడు రోజులుండును. దోషము లేని ప్రథమ, ద్వితీయ, చతుర్థ పాదములలో జన్మించిననూ నక్షత్ర ప్రభావము దుష్టము కావున హోమ సహిత ఆద్య వీక్షణ శాంతి, నవగ్రహ జప, నవగ్రహ దానములు జరిపించాలి. ఈ పాదాలలో పుట్టిన పురుషుడు విద్యార్థనాపరుడు, ఆరోగ్యవంతుడు, నిష్ఠగలవాడు, సత్యవాదియగును. కార్యదీక్ష ఇతనికి మెండుగా నుండును. స్త్రీ జన్మించినచో ఎక్కువ సుఖపడును. హాస్య ప్రియత్వము కలది. కన్నవారియెడ గౌరవాదరములు కలది యగును.

**కృత్తికా నక్షత్రము:** ఈ నక్షత్ర తృతీయ పాదమున పుత్ర జననమునకు పితృగండము, స్త్రీ జననమునకు మాతృగండము కలుగును. మిగిలిన మూడు పాదములలో జన్మించిన ఏ శిశువుకైననూ సామాన్య శాంతి, ఆద్యవీక్షణముతో పాటు నవగ్రహ జపము, నవగ్రహ దానము జరిపించాలి. ఈ నక్షత్రమున పుట్టిన పురుషుడు గంభీర స్వభావి, న్యాయశాస్త్ర కోవిదుడు, ప్రజానాయక లక్షణములు కలవాడు, స్వాభిమాని అవుతాడు. స్త్రీ జన్మించినచో కీర్తివంతురాలు, కాంతిమతి, క్రోధ గుణము కలది. శ్లేష్మసహిత శరీరి అవుతుంది.

**రోహిణి:** మొదటి పాదము, మూడవ పాదములోను జననం వల్ల తల్లికి, మేనమామకు గండము. రెండవ పాదములో జననం అయితే తల్లి మేనమామలతో పాటు తండ్రికి కూడ గండము. నాల్గవ పాదములో జననం వల్ల ఒక్క మేనమామకు మాత్రమే గండము కలదు. అందుచే ఏ పాదమందు జన్మించినను హోమ పూర్వక శాంతి, మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము, నక్షత్ర శాంతి, నవగ్రహ జప, దానములు, సువర్ణ దానము చేయాలి. ఈ నక్షత్రమందు జన్మించిన పురుషుడు స్ఫురద్రూపి, స్థిరచిత్తుడు, ఆత్మాభిమాని, సుఖజీవి కాగలడు. సామర్థ్యము, తేజస్సు, రతిప్రియత్వము, ఇతని ప్రత్యేక లక్షణములు. స్త్రీ అయినచో పుత్ర పౌత్రాభివృద్ధి కలది, రూపవతి, కీర్తిమంతురాలు అయి చిరకాలము జీవించగలది యగును.



**మృగశిర:** ఈ నక్షత్రము సంపూర్ణముగ శుభప్రదము. మగశిశువు అయినచో ధనవంతుడు, ఉత్సాహి, విజయుడు, బృహత్కార్య నిర్వాహకుడు, పవిత్రుడు, వేదజ్ఞాని కాగలడు. స్త్రీ శిశువైనచో సౌందర్యవతి, సంతానము కలది, సమాజంలో కీర్తి పేరు ప్రఖ్యాతులు కలది. ధార్మిక కార్యములు నెరవేర్చునది, పుత్ర సంతానవతి కాగలదు.

**ఆర్ద్ర:** ఈ నక్షత్రము సర్వ శుభదాయని. శుభము, ఈ నక్షత్రమున జన్మించు మగ శిశువు శౌర్య పరాక్రమములు కలవాడు, వ్యాపార వ్యవహారములందు నైపుణ్యము కలవాడు. కృతఘ్నుడు, పాప కార్యాచరణశీలి, చింతాహీనుడు కాగలడు. స్త్రీ కలహ గుణము కలది. పాప కార్యానురక్తి గలిగి యుండును.

**పునర్వసు:** ఈ నక్షత్రమున ఏ పాదములో జన్మించిననూ శుభమే కలుగును. మగ శిశు జననమైనచో అందగాడు, ఇతర స్త్రీల పనులు చేసెడి నేర్పరి, శ్రమ శీలుడు, సంతృప్తి గుణము కలవాడు. ఆరోగ్య వంతుడు అగును. స్త్రీ అయినచో శాంతశీల, బంధు జనానురాగము గలది, సహన గుణము గలది. ధనవతి, ధర్మకార్యాచరణ పరురాలు అగును.

**పుష్యమీ నక్షత్ర జనన దోషము:** ఆడ శిశువుగానీ, మగ శిశువు గానీ మొదటి పాదమున జన్మించినచో మేనమామకు, రెండు మూడు పాదములందు జన్మించినచో తల్లిదండ్రులకు గండము కలదు. దీని నివారణకై సామాన్య హోమ శాంతితో పాటు మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము, నక్షత్ర నవగ్రహ జపములు జరిపించి నవగ్రహదానాలు, గంధపు చెక్క దానం చేయాలి. నాల్గవ పాద జననమునకు ఏ విధమైన దోషమూ లేదు. అయిననూ ఆద్యవీక్షణము చేయదగునని శాస్త్ర నిర్ణయము. ఈ నక్షత్ర జాతకుడు బలశాలి, కామ ప్రకోపము కలవాడు, బుద్ధి స్థిరముగా నుండువాడు, పవిత్రుడు, విద్యార్థన శీలి, అల్ప ధైర్యవంతుడు అగును. స్త్రీ పుట్టినచో రూపవతి, దేవతార్చనాపరురాలు, ఐశ్వర్యవంతురాలు, బ్రాహ్మణభక్తి గలది యగును. ఈమెకు అడుగడుగునా అదృష్టము కలసివచ్చును.

**అశ్లేష:** ఏ శిశువైననూ మొదటి పాదములో పుట్టినచో దోషము కాదు, శుభకరము. రెండవ పాదమున పుట్టినచో ధననష్టము. తండ్రికి గండము. మూడవ పాదములో మాతృగండము. నాల్గవ పాదమున జన్మించినచో ఆ శిశువునకు, తండ్రికి గండము గలదు. మొదటి పాద జనన దోష నివారణకు ఆద్య వీక్షణముతో పాటు సామాన్య శాంతి చేయవలెను. మిగిలిన మూడు పాదముల వలన కలుగు దోషనివారణకు మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము, జన్మ నక్షత్ర, నవగ్రహ జపములు, నవగ్రహ దానములు, సువర్ణ దానములు శుభకరము. ఈ నక్షత్రమున పుట్టిన పురుషుడు స్ఫురద్రూపి, భాగ్యవంతుడు, క్రూరబుద్ధి గలవాడు, పరస్త్రీల యందు అనురక్తి కలవాడు, రహస్యముగా దుష్టస్త్రీ జనులతో రతులు సల్పువాడు, వ్యసనపరుడు కాగలడు. స్త్రీ పుట్టినచో డంబము, దర్పము కలది. అహంకారి, కలహ ప్రియురాలు, దుర్మార్గ చింతన కలది యగును.

**మఘ:** ప్రథమ పాద జననమైనచో శిశువునకు తండ్రికి గండము. ద్వితీయ పాదము సంపూర్ణ శుభప్రదము. తృతీయ పాదములో పుత్ర జననము తండ్రికి, పుత్రికా జననము తల్లికి హానికరము. చతుర్థ పాదము దోష రహితము. ద్వితీయ, చతుర్థ పాద కాల జనన దోష నివారణకు ఆద్యవీక్షణము, సామాన్య శాంతి చేయుట తగును. ప్రథమ, తృతీయ పాదములలో జన్మించు వారికి మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము, నక్షత్ర, నవగ్రహ జపము, నవగ్రహ దానములు, సువర్ణదానము, కర్తవ్యము. ఈ నక్షత్రమున పుట్టినవాడు క్రూరుడు, బలిష్టమైన దేహము గలవాడు, కోపిష్ఠి, తేజస్సు కలవాడు, వాదనా పటిమ గలవాడు కాగలడు. స్త్రీ గౌరవనీయురాలు, ధనవంతురాలు, గురుభక్తి, దైవకార్య చింతన గలదియై సుఖపడగలదు.

**పూర్వ ఫల్గుణీ:** ఏ శిశువు ఏ పాదమందు పుట్టిననూ పెద్ద దోషము కాదు. సామాన్య శాంతి, ఆద్యవీక్షణము జరిపిన సరిపోవును. పురుషుడు పుట్టినచో విచక్షణాశీలి, నాట్య శాస్త్రజ్ఞుడు, ధర్మాత్ముడు, ధన సంపాదనా పరుడు అగును. స్త్రీ జన్మించినచో ఉత్తమ సంతానమును పొంది ధనికురాలు, శత్రుజయాభిలాషి యగును.

**ఉత్తర ఫల్గుణీ:** ఆడగానీ, మగ శిశువుగానీ ప్రథమ పాదమందు పుట్టినచో తల్లిదండ్రులకు గండము, నాల్గవ పాద జననము సోదరులకు దోషకారి. ఈ దోషశాంతికి తిలపాత్ర దానము, హోమ సహిత శాంతి, ఆద్యవీక్షణము అవసరము. ప్రథమ పాద జననము శని దశలోను, మిగిలిన పాదాలు గురు, బుధ దశలలోను

మారకమున్నది. ఈ నక్షత్రమందు జన్మించిన స్త్రీ సంతానవతి, సౌభాగ్యవతి అగును. పురుషుడు దానశీలి, తేజస్వి, కార్యాకార్య విచారము తెలిసినవాడు, నాట్యశాస్త్రజ్ఞుడు అగును.

**హస్త:** ఇది సంపూర్ణ దోషరహిత నక్షత్రము అని శాస్త్రము. తృతీయ పాదమున పుత్ర జననము తండ్రికి, పుత్రిక జననము తల్లికి దోషమని కొందఱి మతము. ఈ జాతకులకు బుధ దశ మారక దశ. సామాన్య శాంతితో ఆద్యవీక్షణము జరుపుట అవసరము. ఈ నక్షత్ర జాతుడు విద్యావంతుడు, పరోపకారి, ధైర్యశాలి, ధనికుడు, స్ఫురద్రూపి కాగలడు. స్త్రీయైనచో సౌందర్యవతి, శీలవతి, సౌభాగ్యవతి కాగలదు.

**చిత్త:** ప్రథమ పాద కాల జననము తండ్రికి, ద్వితీయ పాద జననము తల్లికి, తృతీయ పాద కాల జననము సోదరులకు హానికరము. చతుర్థ పాదము దోషరహితము. మొదటి మూడు పాదాల దోషము 6 మాసములుండును. వస్త్రదానము, రుద్రాభిషేకము, నవగ్రహ జప, నవగ్రహ దాన, నక్షత్ర జపములు జరిపించాలి. ఈ జాతకుడు రతులలో సామర్థ్యము చూపువాడు, విచిత్ర వస్త్రధారణ చేసేవాడు, ధనికుడు, తేజస్వి, భోగి, పండితుడు కాగలడు. ఆత్మగౌరవము, పరభార్యాసక్తిమెండుగా నుండును. స్త్రీలకు ప్రియమైన వాడగును. స్త్రీ జననమైనచో ఆమె వివాహానంతరం తల్లి మరణించును. ఈమె రూపవతి, అలంకార ప్రియత్వము కలదియగును.

**స్వాతి:** ఇది సంపూర్ణ శుభప్రదమైన నక్షత్రము. ఈ నక్షత్ర జాతకుడు ధార్మికుడు, సత్యమూర్తి, శౌర్య పరాక్రమములు కలవాడు, వ్యాపార సామర్థ్యము కలవాడు, కామము కలవాడు, విద్యావంతుడు కాగలడు. స్త్రీ జన్మించినచో కీర్తి ప్రతిష్టలు గలది, సత్యవాదిని, సత్సంతానవతి, నేర్పరి, శత్రువులను జయించగలది యగును.

**విశాఖ:** ఈ నక్షత్రము సంపూర్ణముగా సామాన్య దోషకారి. సాధారణ శుభములిచ్చును. ఈ నక్షత్రమునకు ఆద్యవీక్షణము జరిపిన చాలును. ఇందు జన్మించిన పురుషుడు అసూయాపరుడు, ఇంద్రియ నిగ్రహము గలవాడు, కుశాగ్రబుద్ధి కలిగి ధనికుడు కాగలడు. స్త్రీ సుకుమారి, స్నేహశీలత, దైవభక్తి, బంధుప్రేమ కలిగి యుండును. ఈమెకు తీర్థయాత్రల యందు ఆసక్తిమెండు.

**అనూరాధ:** ఈ నక్షత్రము సర్వ శుభదాయిని. పురుషుడు పరాక్రమవంతుడు, విదేశాలు తిరిగేవాడు. రాజకీయ వ్యవహారములందు ఇష్టత కలవాడు, అందగాడు, స్త్రీల యందు అనురక్తి కలవాడు అగును. స్త్రీ జన్మించినచో మంచి మిత్రులు గల నిగర్వి, పతిభక్తి గలది, సౌందర్యవతి, ధనవంతురాలు, అలంకార ప్రియత్వము గలదియగును.

**జ్యేష్ఠ:** ఇది రాక్షస గణ నక్షత్రము. సమస్త దోషకారి. ఈ నక్షత్ర దోషమునకు పాదముల లెక్కన గాక, భాగములలెక్కన చూచుకొనవలెను. ఈ నక్షత్రమును 10 భాగాలుగా విభజించాలి. ఆడ శిశువైననూ, మగ శిశువైననూ --

1వ భాగమున జననము వలన తల్లి తల్లి (మతామహి)కి గండము.
2వ భాగమున తండ్రి తండ్రి (పితామహుడు)కి గండము.
3వ భాగమున తల్లి సోదరులకు (మేనమామలకు) గండము.
4వ భాగము వలన తల్లికి గండము.
5వ భాగమున పుట్టిన శిశువునకే గండము.
6వ భాగమున సగోత్రీకులకు వంశానికి దోషము.
7వ భాగమున తల్లిదండ్రులకు,
8వ భాగమున శిశువు తోబుట్టువులకు,
9వ భాగమున మామగారికి, దోషకారి.
10వ భాగము వలన ఎవరికైననూ కీడు రావచ్చును.

ఈ నక్షత్రములో పుత్రికా పుత్రులు ఎవరైనా జన్మించినను దోషముగనుక మహన్యాస రుద్రాభిషేకము (హోమశాంతి) నక్షత్ర, నవగ్రహ, జపములు చేయవలెను. ఈ దోష పరిహారానికి గోదాన సహిత శాంతులు జరపాలి. ఈ నక్షత్రమున బుట్టిన పురుషుడు శ్రమించు వాడు, కామము గలవాడు, కోపిష్ఠియగును.



ఈ నక్షత్రమున స్త్రీ జన్మించినచో ధనవంతురాలు, పెద్దలయందు గౌరవము కలది, మాటకారి అగును. కుటుంబ సభ్యులయందు అధిక ప్రేమగలది అగును. మంగళవారముతో కలిసినపుడు స్త్రీ జన్మించినచో ఆమె పెద్దన్న (జ్యేష్ఠభ్రాత) నశించును. ఈమెను వివాహమాడిన వాని యన్నయు నశించునని కొందఱి మతము.

**మూలా నక్షత్రము:** మూలా నక్షత్రమును 12 భాగములుగా విభజించి, దోషములు చూచుట, 15 భాగములుగా చూచుట అను రెండు పద్ధతులు గలవు. కాని పెక్కురు 12 భాగములు చేసి చూచుటనే అవలంబింతురు. ఆ ప్రకారము --

1వ భాగము తండ్రికి, 2వ భాగము పిన తండ్రికి లేదా తల్లికి, 3వ భాగము సోదరులకు లేదా బావమరిదికి, 4వ భాగము పితామహుడు (తండ్రి తండ్రికి) లేదా శిశువు యొక్క అక్క చెల్లెళ్ళకు, 5వ భాగము తల్లికి లేదా మేనమామకు, 6వ భాగము మేనత్తకు, 7వ భాగము పినతల్లికి, పెదతల్లికి, 8వ భాగము పినతండ్రి లేదా పెత్తండ్రికి, 9వ భాగము మాతామహుడు (తల్లి తండ్రికి) లేదా శిశువునకు కీడు జరుగును. 10వ భాగము దారిద్ర్యకారకము, 11వ భాగము రాజ్యలాభము, 12వ భాగము సౌభాగ్యకరము.

**పాదముల లెక్కన చూచినచో:** 1వ పాదమున పుత్రోదయమైనచో తండ్రికి, పుత్రికయైనచో పశువులకు హాని కలుగును. ద్వితీయ పాదమున పుత్రుడు జన్మించినచో తల్లికి గండము. పుత్రిక జన్మిస్తే సామాన్య దోషము. తృతీయ పాదమున పుత్రుడు జన్మిస్తే ధననష్టము, పుత్రికయైనచో పితృపక్షమునకు హాని కలుగును. చతుర్థ పాదమున పుత్రుడు జన్మిస్తే సామాన్య దోషము, పుత్రికయైనచో మాతృపక్షమునకు హాని. ఈ దోషాలకు హోమ, శాంతి, మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము, నక్షత్ర, నవగ్రహ జపములు, దానములు, చేయవలెను. బంగారంతో చేసిన ఎనుబోతు (మహిష) ప్రతిమను దానం చేయాలి.

ఈ నక్షత్రమున పుట్టినవాడు ధర్మజ్ఞుడు, ధనికుడు, భోగజీవి యగును. పుత్రికయైనచో విద్యలో విముఖత, పెద్దగా సుఖము, సంతోషము, లేనిది యగును.

**పూర్వాషాఢ:** ప్రథమ, ద్వితీయ చతుర్థ పాదములందు ఏ శిశువు జన్మించినచో దోషము బహు స్వల్పము. సామాన్య శాంతితో పాటు ఆద్యవీక్షణము సరిపోవును. తృతీయ పాదమున పుత్రజననము తండ్రికి, పుత్రికా జననము తల్లికి, దోషము కలిగించును. ఈ దోష పరిహారార్థము హోమ సహిత శాంతి, రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు, దానములు చేయాలి. ఈ నక్షత్రమందు మగ శిశువు జననమైనచో అతడు వినయశీలి, ప్రసన్నత గలవాడు, దానగుణము కలవాడు, ఆత్మాభిమాని యగును. స్త్రీ జన్మించినచో ప్రాణి రక్షణ చేయునది, బలవంతురాలు, ఆరోగ్యము కలది, విశాలాక్షి, శీలవతి యగును.

**ఉత్తరాషాఢ:** ఈ నక్షత్రము పూర్తిగా శుభకరము. దీని యందు జన్మించిన పురుషుడు ధర్మపక్షపాతి, విశ్వాసపాత్రుడు, శూరత్వం గలవాడు, పుత్రసంతానం గలవాడు, అందగాడు, గుణశీలియగు కళత్రమును పొందగలవాడు అగును. స్త్రీ జన్మించినచో ధనికురాలు, భోగభాగ్యములనుభవించునది, పురుషుల హృదయములను సులభముగా గ్రహించునది యగును. భర్తచే అధికముగా ప్రేమింపబడగలది యగును.

**శ్రవణము:** ఈ నక్షత్రము సంపూర్ణముగా దోషరహితమైనది. ఇందు పుట్టిన పురుషుడు పండితుడు, ధైర్యశాలీ, ఉదార స్వరూపుడు, వాగ్వాదములందు జయించువాడు, ధార్మికుడు అగును. స్త్రీ జన్మించినచో బుద్ధివంతురాలు, భాగ్యవంతురాలు, దానగుణము కలది యగును.

**ధనిష్ఠ:** సర్వ శుభప్రదమైన ఈ నక్షత్రమందు జన్మించిన పురుషుడు క్రౌర్యము గలవాడై వ్యసన పరుడు అగును. క్షయవ్యాధిగ్రస్తుడగును, రహస్య నేరములు నెరపువాడు, పరస్త్రీ సంగతికి ఇష్టపడువాడు అగును. స్త్రీ జన్మించినచో ధనవంతురాలు, సంతానవతి, భూతదయ గలది యగును.

**శతభిషము:** అన్ని విధములుగానూ శుభప్రదమైన ఈ నక్షత్రమందు జన్మించిన పురుషుడు కపటి, దుష్టుడు, సుందరదేహుడు, భార్యను ఆరాధించువాడు కాగలడు. స్త్రీ పుట్టినచో దాన ధర్మములు చేయును. దైవభక్తి గలది, నేర్పరి, సంపన్నురాలు, సంతానవతి యగును.

**పూర్వాభాద్ర:** ఏ శిశువు ఏ పాదమున జన్మించిననూ సామాన్య దోషమగును. కావున సామాన్య శాంతితో పాటు ఆద్యవీక్షణము జరుపవలెను. ఈ నక్షత్రమున పుట్టిన పురుషుడు వ్యసనపరుడు, స్త్రీలోలుడు,

రహస్య నేర స్వభావము గలవాడు, పరనింద - ఆత్మస్తుతి చేయువాడు అధర్మ కార్య నిర్వాహకుడు, శౌర్యశాలి యగును. ఇందు జన్మించిన స్త్రీ దైవభక్తి గలది, సంపన్నురాలు, భాగ్యవంతమైన సంతానము కలది, విద్యా వినయ సంపన్నత గలది, పెద్దల యెడ గౌరవాదరములు గలది యగును.

**ఉత్తరాభాద్ర:** ఇది సంపూర్ణ శుభప్రదమైన నక్షత్రము. ఇందు జన్మించిన పుత్రుడు సంతాన సౌభాగ్యములతో విలసిల్లును. ధార్మికుడు, శత్రువులను జయించువాడగును. మాటకారితనము ఎక్కువ. ఇందు జన్మించిన స్త్రీ శాంత స్వభావి, క్షమాగుణము కలది, ధనికురాలు, సంతానవతి, గౌరవనీయురాలు అగును.

**రేవతి:** ఈ నక్షత్రమందు చతుర్థ పాదము తప్ప తక్కిన పాదములన్నియు శుభప్రదములు. నాల్గవ పాదమున పుత్రుడు జన్మించిన తండ్రికి, శిశువునకు, పుత్రిక జన్మించినచో తల్లికి, శిశువునకు, దోషము. ఈ దోష నివారణకు హోమ సహిత శాంతి, రుద్రాభిషేకము, నక్షత్ర, నవగ్రహ జప, దానములు చేయాలి. ఒకటి రెండు మూడు పాదములలో పుట్టిన వారికి సాధారణ శాంతి, ఆద్యవీక్షణము జరుపవలెను. ఈ నక్షత్రమున జన్మించిన పురుషుడు ధనవంతుడు, యశస్వి, సౌందర్యవంతుడు, పండితుడు, ధైర్యవంతుడు, ధైర్యసాహసములు కలవాడు, అన్యదేశ సంచారము చేయువాడగును. ఇందు జన్మించిన స్త్రీ శరీర పుష్టి గలది, ఆచార పరాయణురాలు, ధనవంతురాలు, గుణవంతురాలు, దైవభక్తి గలది, చురుకైనది అగును.

## రాసుల వలన వచ్చు గండములు

జననముల రాశుల సంధి సమయమున జరిగినచో విభిన్న ఫలితములుండును.

మీన-మేషముల సంధి, కర్కట - సింహముల సంధి, వృశ్చిక ధనుస్సుల సంధి, అర్ధ ఘడియ సమయము. ఈ సంధులందు జననము జరిగినచో శిశుగండము. ఈ దోష పరిహారార్థము నవగ్రహ జపము, నక్షత్ర జపము, రుద్రాభిషేకము, అశ్వత్థ ప్రదక్షిణము, హోమము, అన్నదానము యధాశక్తి చేసినచో శాంతి కలుగును. గండము తిథి వలన సంభవించినచో ఎద్దును, నక్షత్ర దోషము వలన గండము కలిగినచో గోవును, లగ్న గండమైనచో సువర్ణము దానము చేయాలి.

## జనన కాలమందు చేయవలయు బాల్యోపచారములు

**శ్లో॥ ఉత్తేప నాద్విః బాలశ్చ కుద్ధిస్యాద్యుపవేశనాత్।**
**తస్మాదేతాని వర్జ్యాని నిత్యం బాల హితార్థినా॥**

అప్పుడే పుట్టిన బిడ్డను మెత్తనైన ప్రక్కపై పరుండబెట్టాలి. బాల్యంలో పిల్లలను భయపెట్టుట వన పెరిగి పెద్దవారైన తరువాత భీరువు (పిరికివాడు)గా తయారగును. నిద్రించు శిశువును ఆకస్మాత్‌గా లేపినచో శ్వాస ప్రక్రియను అవరోధములు, మానసికాందోళనము కలుగును. పిల్లలను పైకి ఎగురవేసి ఆడించుటచే పెరుగుదల ఉండదు. కావున బాలల శ్రేయస్సు దృష్ట్యా ఈ పనులు నిషేధములు.

## బాలారిష్టములిచ్చు గ్రహ స్థానములు

జనన కాల లగ్నమునకు చంద్రుడు ఎనిమిదింటను, కుజుడు (౭) ఏడింటను, రాహువు (౯) తొమ్మిదింటను, శని (౧) ఒకటవ యింటను, గురుడు (౩) మూడింటను, శుక్రుడు (౬) ఆరింటను, బుధుడు (౭-౪) ఏడింట నాలుగింటను, సూర్యుడు (౧౨) పన్నెండవ యింటను యున్నచో బాలారిష్ట దోషకారకులగుదురు.

## బాలారిష్ట దోష భంగము

శిశువు యొక్క జన్మ లగ్నమునకు పైన చెప్పిన స్థానములందు పైన చెప్పిన గ్రహములుండిననూ, ఆ రాసులను బలీయములగు శుభ గ్రహముల దృష్టి యుండిననూ, కేంద్ర స్థానము లందు అనగా ౧, ౪, ౭, ౧౦ రాసులలో కనీసం ఒక్క శుభగ్రహము ఉన్నను, బాలారిష్ట దోషము తొలగిపోయి, ఆయుర్దాయము పెరుగును.

**కెరటాన్ని మనం ఆదర్శంగా తీసుకోవాలి. లేచి పడినందుకు కాదు- పడి లేచినందుకు.**



# వివాహ మైత్రి అష్ట కూటములు

**1. వర్ణ కూటమి గణములు (జాతులు 4)**
2వ రాశి కూటమిలో వివరన ఏ వర్ణమో, ఏ జాతియో చూడుడు.

| వధూ వర్ణము | | పర వర్ణము 1 బ్రాహ్మణ | 2 క్షత్రియ | 3 వైశ్య | 4 శూద్ర |
|---|---|---|---|---|---|
| 1 | బ్రాహ్మణ | 1 | 0 | 0 | 0 |
| 2 | క్షత్రియ | 1 | 1 | 0 | 0 |
| 3 | వైశ్య | 1 | 1 | 1 | 0 |
| 4 | శూద్ర | 1 | 1 | 1 | 1 |

| వధూ వర్ణము | వర వర్ణము రాసులు | | | |
|---|---|---|---|---|
| | | రాసి | రాసి | రాసి |
| బ్రాహ్మణ | రాసి | కర్కా | వృశ్చి | మీన |
| క్షత్రియ | రాసి | మేష | సింహ | ధను |
| వైశ్య | రాసి | వృష | కన్య | మకర |
| శూద్ర | రాసి | మిథు | తుల | కుంభ |

**2. వశ్య కూటమి గుణములు**
జీవ జాతులు 5.

| వధూ వశ్య | | వర వశ్య 1 చతు | 2 మాన | 3 జల | 4 వన | 5 కీట |
|---|---|---|---|---|---|---|
| 1 | చతుష్పాదం | 2 | 1/2 | 1 | 0 | 2 |
| 2 | మానవ | 1/2 | 2 | 0 | 0 | 0 |
| 3 | జలచరము | 1 | 0 | 2 | 2 | 2 |
| 4 | వనచరము | 0 | 0 | 2 | 2 | 0 |
| 5 | కీటకము | 1 | 0 | 1 | 0 | 2 |

| వధూ | వర వశ్య రాసులు | | | | |
|---|---|---|---|---|---|
| చతు<br>మాన<br>జల<br>వన<br>కీట | మేష<br>మిథున<br>కర్కా<br>సింహ<br>వృశ్చిక | వృషభ<br>కన్య<br>మకర | తుల<br>మీన | ధను | కుంభ |

**3. తారా కూటమి గుణములు (నక్షత్రములు) తారలు 27**
ప్రతి వరుసకు 9 చొప్పున గణన మొత్తం 27 నక్షత్రములు 3 వరుసలు

| వధువు తారలు (నక్షత్రములు) | వరుని తారలు (నక్షత్రములు) | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | అశ్వి మఘ మూల | భర పుబ్బ పూషా | కృత్తి ఉత్తర ఉషా | రోహ హస్త శ్రవ | మృగ చిత్త ధని | ఆరు స్వాతి శత | పున విశా పూభా | పుష్య అనూ ఉభా | ఆశ్రే జ్యేష్ఠ రేవ |
| 1 | అశ్వి మఘ మూల | 3 | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | 3 |
| 2 | భర పుబ్బ పూషా | 3 | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | 3 |
| 3 | కృత్తిక ఉత్తర ఉషా | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ | 0 | $1\frac{1}{2}$ | 0 | $1\frac{1}{2}$ | 0 | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ |
| 4 | రోహ హస్త శ్రవ | 3 | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | 3 |
| 5 | మృగ చిత్త ధని | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ | 0 | $1\frac{1}{2}$ | 0 | $1\frac{1}{2}$ | 0 | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ |
| 6 | ఆర్ద్ర స్వాతి శత | 3 | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | 3 |
| 7 | పున విశా పూభా | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ | 0 | $1\frac{1}{2}$ | 0 | $1\frac{1}{2}$ | 0 | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ |
| 8 | పుష్య అనూ ఉభా | 3 | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | 3 |
| 9 | ఆశ్రే జ్యేష్ఠ రేవ | 3 | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | $1\frac{1}{2}$ | 3 | 3 |

## 4. యోని కూటమి (14 యోనులు)

| క్రమ సంఖ్య | వధూ ⬇ / వర ➡ | 1 అశ్వము | 2 గజము | 3 మేషము | 4 సర్పము | 5 శ్వానము | 6 మార్జాలము | 7 మూషికము | 8 గోవు | 9 మహిషము | 10 వ్యాఘ్రము | 11 మృగము | 12 వానరము | 13 నకులి | 14 సింహము | నక్షత్రములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | గుఱ్ఱము-అశ్వము | 4 | 2 | 2 | 3 | 2 | 2 | 2 | 1 | 0 | 1 | 3 | 3 | 2 | 1 | అశ్వని-శతభిషం |
| 2 | ఏనుగు-గజము | 2 | 4 | 3 | 3 | 2 | 2 | 2 | 2 | 3 | 1 | 2 | 3 | 2 | 0 | భరణి-రేవతి |
| 3 | మేక-మేషము | 2 | 3 | 4 | 2 | 1 | 2 | 1 | 3 | 3 | 1 | 2 | 0 | 3 | 1 | కృత్తిక-పుష్యమి |
| 4 | పాము-సర్పము | 3 | 3 | 2 | 4 | 2 | 1 | 1 | 1 | 1 | 2 | 2 | 2 | 0 | 2 | రోహిణి-మృగశిర |
| 5 | కుక్క-శ్వానము | 2 | 2 | 1 | 2 | 4 | 2 | 1 | 2 | 2 | 1 | 0 | 2 | 1 | 1 | ఆర్ద్ర-మూల |
| 6 | పిల్లి-మార్జాలము | 2 | 2 | 2 | 2 | 2 | 4 | 0 | 2 | 2 | 1 | 3 | 3 | 2 | 1 | పునర్వసు-ఆశ్లేష |
| 7 | ఎలుక-మూషికము | 2 | 2 | 1 | 1 | 1 | 1 | 4 | 2 | 2 | 2 | 2 | 2 | 1 | 2 | మఘ-పుబ్బ |
| 8 | ఆవు-గోవు | 1 | 2 | 3 | 1 | 2 | 2 | 2 | 4 | 3 | 0 | 3 | 2 | 2 | 1 | ఉత్తర-ఉత్తరాభాద్ర |
| 9 | దున్న-మహిషము | 0 | 3 | 3 | 1 | 2 | 2 | 2 | 3 | 4 | 1 | 2 | 2 | 2 | 1 | హస్త-స్వాతి |
| 10 | పులి-వ్యాఘ్రము | 1 | 1 | 1 | 2 | 1 | 1 | 2 | 0 | 1 | 4 | 1 | 1 | 2 | 1 | చిత్త-విశాఖ |
| 11 | జింక-మృగము | 3 | 2 | 2 | 2 | 0 | 3 | 2 | 3 | 2 | 1 | 2 | 4 | 3 | 1 | అనూరాధ-జ్యేష్ఠ |
| 12 | కోతి-వానరము | 3 | 3 | 0 | 2 | 2 | 3 | 2 | 2 | 2 | 1 | 2 | 4 | 3 | 2 | పూ.షా-శ్రవణం |
| 13 | ముంగిస-నకుల | 2 | 2 | 3 | 0 | 1 | 2 | 1 | 2 | 2 | 2 | 2 | 3 | 4 | 2 | ఉ.షా-అభిజిత్ |
| 14 | సింహము-సింహము | 1 | 1 | 1 | 2 | 1 | 1 | 2 | 1 | 1 | 1 | 1 | 2 | 2 | 4 | ధనిష్ఠ-పూ.భా |



## 5. గ్రహమైత్రి కూటమి గుణములు

7. గ్రహములు:- రాహు-కేతువులు ఛాయాగ్రహములు వధూ-వర జన్మ లగ్నాధిపతుల బలాబల విచారణ

| ☉ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రాసులు | మేష | వృష | మీన | కర్కా | సింహ | కన్య | తుల | వృ | ధనుః | మకర | కుంభ | మీన |
| గ్రహములు | కు | శు | బు | చ | ర | బు | శు | కు | గు | శ | శ | గు |

| వధువు గ్రహము ⬇ | | వరుని గ్రహము 1 రవి | 2 చంద్ర | 3 కుజ | 4 బుధ | 5 గురు | 6 శుక్ర | 7 శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | రవి | 5 | 5 | 5 | 4 | 5 | 0 | 0 |
| 2 | చంద్ర | 5 | 5 | 4 | 1 | 4 | 1/2 | 1/2 |
| 3 | కుజ | 5 | 4 | 5 | 1/2 | 5 | 3 | 1/2 |
| 4 | బుధ | 4 | 1 | 1/2 | 5 | 1/2 | 5 | 4 |
| 5 | గురు | 5 | 4 | 5 | 1/2 | 5 | 1/2 | 3 |
| 6 | శుక్ర | 0 | 1/2 | 3 | 5 | 1/2 | 5 | 5 |
| 7 | శని | 0 | 1/2 | 1/2 | 4 | 3 | 5 | 5 |

### గ్రహమైత్రి కూటమి

| | ఫలములు | గుణములు |
|---|---|---|
| 1 | మహావిరోధము | 1/2 |
| 2 | ఉభయ-శత్రుత్వము | 1 |
| 3 | తాటస్థ్యత | 2 |
| 4 | ఉభయమిత్రత | 3 |
| 5 | అతిస్నేహము | 4 |
| 6 | సమజాతి | 5 |

## 6. గణకూటమి గుణములు

| గణములు | నక్షత్రములు | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| దేవ | మృగ | పున | పుష్య | స్వాతి | శ్రవ | రేవ | అనూ | అశ్వి | హస్త |
| మనుష | ఉ.ఫ. | ఉ.షా. | ఉ.భా | పూ.ఫ | పూ.షా. | పూభా | భరణి | రోహి | ఆర్ద్రా |
| రాక్ష | మఘ | ధని | ఆశ్లే | కృత్తి | విశా | జ్యేష్ఠ | మూల | చిత్త | శత |

| వధువు గణము ⬇ | | వరుడు గణము 1 దేవ | 2 మను | 3 రాక్ష |
|---|---|---|---|---|
| 1 | దేవ | 6 | 5 | 1 |
| 2 | మను | 5 | 6 | 0 |
| 3 | రాక్ష | 1 | 0 | 6 |

"స్వధర్మే నిధనం శ్రేయః"

స్వధర్మమందు మరణము మేలు.

నీ ధర్మాచరణమే నిన్ను రక్షించును.

అనాలోచితముగా తొందరపడి, ఏమియు చేయరాదు. చిత్తశుద్ధి, ఓర్పు, పట్టుదల, ఈ మూడును కార్యసిద్ధికి ఆవశ్యకములు. కాని ప్రేమ ఈ మూడింటికన్న అత్యావశ్యకము.

— స్వామి వివేకానంద

## 7. రాసికూటమి గుణములు వరుని రాసులు

| వధూ రాసులు ↓ / వరుడు రాసులు → | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | రాసులు 12 జాతులు: జీవము | జాతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 మేషం | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 | చతుష్పాత్ | క్షత్రియ ౧ |
| 2 వృషభం | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | చతుష్పాత్ | వైశ్య ౨ |
| 3 మిధునం | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | మానవ | శూద్ర ౩ |
| 4 కర్కాటకం | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | జలచర | బ్రాహ్మణ ౪ |
| 5 సింహం | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | వనచర | క్షత్రియ ౫ |
| 6 కన్య | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | 7 | మానవ | వైశ్య ౬ |
| 7 తుల | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | 0 | మానవ | శూద్ర ౭ |
| 8 వృశ్చికం | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | 0 | కీటక | బ్రాహ్మణ ౮ |
| 9 ధనుస్సు | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | 7 | 7 | మానవ | క్షత్రియ ౯ |
| 10 మకరం | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 7 | 7 | 7 | 0 | 7 | జలచర | వైశ్య ౧౦ |
| 11 కుంభం | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | 0 | మానవ | క్షత్రియ ౧౧ |
| 12 మీనం | 0 | 7 | 7 | 0 | 0 | 7 | 0 | 0 | 7 | 7 | 0 | 7 | జలచర | బ్రాహ్మణ ౧౨ |
|  | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |  |  |

### నాడి తెలుపు నక్షత్రములు

| నాడి | నక్షత్రములు | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | అశ్వి | ఆర్ద్ర | పున | ఉత్త | హస్త | జ్యేష్ఠ | మూల | శత | పూ.భా |
| మధ్య | భర | మృగ | పుష్య | పుబ్బ | చిత్త | అనూ | పూ.షా | ధని | ఉ.భా |
| అంత్య | కృత్తి | ఆశ్రే | స్వాతి | ఉ.షా | శ్రవ | రోహి | మఘ | విశా | రేవ |

### 8. నాడీ కూటమి నక్షత్రములు గుణములు

|  | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|
| 1 | వరః | ఆది పార్శ్వ | మధ్య | అంత్య |
| 2 | ఆది పార్శ్వ | 0 | 8 | 8 |
| 3 | మధ్య | 8 | 0 | 8 |
| 4 | అంత్య | 8 | 8 | 0 |

పార్శ్వ నాడియే ఆదినాడి

ఐశ్వర్యానికి ఆభరణం
మంచితనం.
విద్యకు అలంకారం
నీతి. ధనానికి
అలంకారం దానం.
అన్ని గుణాలకీ
అలంకారం
మంచి శీలం.



**సూచన:** పురుషరాసి నుండి స్త్రీరాశివరకు,స్త్రీ రాసి నుండి పురుష రాసి వరకును లెక్కింపగా పరస్పరము ౭,౪,౭,౧౦,౧౧ వచ్చినను వధూవరులది ఏకరాసి అయినను శుభము. ఈ రాసికూట గణన విషయములో మతాంతరములు చాలగలవు. కావునపెద్దల వాక్యమును గమనించగలరు.

| క్ర.సం. | అష్టకూటముల సంఖ్య | గుణములు |
|---|---|---|
| 1. | వర్ణ కూటమిలో (మేషం క్షత్రియ; క్షత్రియ-క్షత్రియ) | 1 |
| 2. | వశ్య కూటమిలో (మేషం చతుష్పాదము చతు-చతు) | 2 |
| 3. | తారా కూటమిలో ౧ నుంచి ౧ కు (అశ్విని నుంచి అశ్విని) | 3 |
| 4. | యోని కూటమిలో (అశ్విని నుంచి అశ్విని) | 4 |
| 5. | గ్రహకూటమిలో (మేషానికి అధిపతి కుజుడు కుజ మొ॥ కుజ) | 5 |
| 6. | గణ కూటమిలో (అశ్విని దేవగణము దేవ-దేవ) | 6 |
| 7. | రాశి కూటమిలో (అశ్విని మేషరాశి గదా మేషం మొ॥మేషం) | [illegible] |
| 8. | నాడీ కూటమిలో (అశ్విని ఆదినాడి ఆది-ఆది) | 0 |
|  | మొత్తము కూడిన వచ్చిన గుణములు | 28 |

## అష్టకూటాలు ఎలా చూడాలి ?

ముందుగా ౧ మొదలు ౮ వరకు కూటాలు చూడండి. ఉదాహరణకు వధువు-అశ్విని; వరుడు అశ్విని, ఒక కాగితం మీద ఇలా వ్రాయాలి మొత్తము చేయాలి. ఆ సంఖ్యనే ఇన్ని గుణములు అందురు. ౧౮ గుణములు ౧౮ పైన ఎన్ని ఉన్నా శుభమే. ౪,౬,౭,౮ వ నాటికి నక్షత్ర వివరణ గల పాణి గ్రహణోపయోగ చక్రము పుటలో చూడుడు. గణ, యోని, నాడి తెలియును.

ఇలాగే ప్రతి నక్షత్రము-రాసి అన్నీ ఏకం చేసి చూడాలి. ఇలా మొత్తము గుణాలు ఎన్నో చూడడమే (మేళన-కలియు) మేళనము అంటారు. ఇప్పుడు గుణ మేళన చక్రంలో అశ్విని మొదలు అశ్వినికి చూడండి ౨౮ ఉందికదూ! అంటే అశ్విని నక్షత్రానికి ౨౮ గుణమలులు. వధువు నక్షత్రం నుంచి వరుడు వరకును, వరుడు నక్షత్రము నుంచి వధువు వరకు చూడాలి. వధూ-వరులకు కలసి వచ్చిన గుణములు (మార్కులు) మొత్తము 28 అన్నమాట.

దృఢ సంకల్పం మనిషి చేతిలో ఉండే మహత్తర శక్తి.
ఇదే మనిషిని విజయమార్గంలో నడిపించే ఇంధనం.

